శ్రీః

# కాళీతన్త్రమ్

## ప్రథమః పటలః

మధురావ్యాఖ్యా - చింతగుంట సుబ్బారావు



ప్రకాశకులు

**శ్రీమతి రావి కృష్ణకుమారి**

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

శ్రీః

# కాళీతన్త్రమ్

## ప్రథమః పటలః

**మధురావ్యాఖ్యా - చింతగుంట సుబ్బారావు**

ప్రతులు : 500
ప్రథమ ముద్రణ : తొలిఏకాదశీ - 04.07.2017.
పుటలు : 24
వెల రూ. : 10/-


404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**

D.T.P.:
**P. PARVATHI**
Cell : 7416586775.

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

# విషయసూచిక





తెనుగున అర్థతాత్పర్యములు కూర్పబడిన ఈ '**కాళీతంత్ర**' ప్రథమ పటలమును సాధకులు సాదరముగ స్వీకరింతురు గాక.

**- రామోరా, సంపాదకుడు.**

# భూమిక

ఇది తంత్రశాస్త్ర సంబంధమైన విషయమని పేరును బట్టే తెలుస్తుంది. పేరు తంత్రశాస్త్రం అయినా, నిజానికిది యంత్ర తంత్ర మంత్ర విషయికమైనది. ఈ మూడున్నూ విడదీయరానివి. విశ్వమంతా ఒక పెద్దయంత్రం కాగా అందున్న ప్రతి అణువూ దానికదే ఒక చిన్నయంత్రం. హస్తిమశకపర్యంతజీవజంతువులే కాదు, అచేతనములుగా కన్పిస్తూన్న వస్తుజాలమంతా ఈ యంత్రపరిధిలోనిదే. ఈ చిన్న, పెద్ద యంత్రాల నిర్మాణంలో భేదమున్నది. దానివలన ఆ యా యంత్రాలను నియంత్రించే తంత్రంలోనూ భేదాలేర్పడినవి. ఈ యంత్ర తంత్రాలను రెండింటినీ శక్తివంతం చేయగలిగినది మంత్రం.

ఈ త్రితయంలో యంత్రం భౌతికరూపవిలసితం. కాని, అచేతనం. ఈ యంత్రం క్రియారూపం దాల్చినప్పుడు, లేక యంత్రం పనిచేయుటకు, తంత్రం అవసరం. ఈ తంత్రాన్ని సమర్థశక్తిగా రూపొందించేది మంత్రం. ఈ మంత్రం అందలి బీజాక్షరాలవలన శక్తివంతమై తంత్రానికి ప్రేరణ కలిగించగా, తంత్రం క్రియాన్వితమై యంత్రాన్ని నడిపిస్తుంది. బీజాక్షరంలో సూక్ష్మాతిసూక్ష్మస్థితిలో శక్తి, కుండలినివలె, జాగృతమవుతుంది.

విశ్వాన్ని గూర్చిన ఈ అవగాహన భారతీయ సంస్కృతిలో మౌలిక పాత్ర పోషిస్తుంది. ఇది వైదికము, స్మార్తము, ఆగమసమ్మతము. ఆచారక్రియావిషయంలో మతభేదాలున్నవి. తంత్రశాస్త్రం మనకు ప్రాచీనులందించిన వారసత్వ నిధి. ఆచరణ సర్వసాధ్యం కాకున్నా, ఆదరభావంతో చూడగలం.



శ్రీః

# కాళీతన్త్రమ్

## ప్రథమః పటలః

### మధురావ్యాఖ్యా – చింతగుంట సుబ్బారావు

శ్లో॥ కైలాసశిఖరే రమ్యే దేవదేవం మహేశ్వరమ్ ।
ఉవాచ పార్వతీ చైవం భైరవం పరమేశ్వరమ్ ॥ 1

**ప్రతిపదార్థం :** రమ్యే = ఆనందమయమగు, కైలాసశిఖరే = కైలాసపర్వతశిఖరముపై, దేవదేవమ్ = దేవతలందఱకు దేవుడైన, మహేశ్వరమ్ = ఈశ్వరులలో మహత్తగల, భైరవమ్ = భైరవుడను, పరమేశ్వరమ్ = సర్వాధిపుని గూర్చి, పార్వతీ = పార్వతి, ఏవమ్ = ఈ విధముగా, ఉవాచ చ = అడిగెను, పలికెను.

**తాత్పర్యం :** ఆనందమయమైన కైలాసపర్వతముపై దేవతలకును, ప్రభువులకును ప్రభువైన భైరవుని పార్వతి ఈ విధంగా అడిగింది.

శైవ సంప్రదాయంలో, శివుని అష్టమూర్తులలో ఒకమూర్తి భైరవమూర్తి. ఈ మూర్తి జీవుని పవిత్రీకరించే క్రియాశీలియైన రుద్రమూర్తి. ప్రకృతిలోని అనేక స్థాయీ భేదాలతో అలరారే జీవులను ఈ భైరవుడే ముక్తికి యోగ్యులుగా పరిశుద్ధులను చేయు పరమదైవము. కనుక దేవదానవమానవజంతువృక్షక్రిమికీటకాది జీవులందఱకు పరమగురువు, ప్రభువు యీ **భైరవుడు**. వాని నెలవైనది **కైలాసము**. అది ఆనందనిలయము, ఆనందమునకు శిఖరాయమానమైన ప్రదేశము, లేక, స్థితి. కేల్ (ఆడుట) ధాతూద్భవం. ఆటలోని సారరూపమైనది ఆనందము. ప్రాకృతిక జీవనము జీవున కానందముతో గూడి వేదన నిచ్చును. అందుకు మూలము జీవాహంకారము. దానిని శివమయము చేసినప్పుడు ఆట ముగిసి, ఆనందము మిగులును. అట్టి స్థితికి చరమదశ ఈ కైలాసశిఖరము. వానిని పార్వతి ఇట్లడిగినది.

**చ** ప్రయోగం సంభాషణక్రమంలో ఈ ప్రశ్న వచ్చినట్లు సూచిస్తుంది.

**పార్వత్యువాచ ।** పార్వతీ = పార్వతి, ఉవాచ = అడిగెను.

**శ్లో॥ దేవదేవ! మహాదేవ! సృష్టిస్థితిలయాత్మక! ।**
**కాలికాఖ్యా మహావిద్యా సమస్తభేదసంయుతా ॥ 2**

**ప్రతిపదార్థము :** దేవదేవ! = దేవతల ప్రభూ!, మహాదేవ! = దేవతలలోనెల్ల మహత్తగలవాడా!, సృష్టి = విశ్వముయొక్క పుట్టుక, స్థితి = ఉనికి, లయ = నాశము, అను ఈ మూడిటికి, ఆత్మక! = కేంద్రమైనవాడా!, కాలికా = కాళిక, ఆఖ్యా = అని పిలవబడు, మహావిద్యా = విద్యలలోనెల్ల గొప్పదైన విద్య, సమస్తభేదసంయుతా = భేదములన్నిటితో కూడినది, (కా = ఏది?).

**తాత్పర్యం :** దేవదేవా! మహాదేవా! సృష్టిస్థితిలయములకు నీవే మూలము. (కనుక నీవే చెప్పగలవని అడుగుచున్నాను.) కాళికా అనబడే మహావిద్య యేది? దానిని సర్వభేదములతో గూడ వివరించుము.

---

**భైరవ ఉవాచ।** భైరవః = భైరవుడు, ఉవాచ = పలికెను.

**శ్లో॥ సపర్యాభేదసంయుక్తా చతుర్వర్గఫలప్రదా ।**
**మహావిద్యా మహామాయా మహాభేదా మహాలయా ॥ 3**

**శ్లో॥ సర్వవిద్యామహారాజ్ఞీ సర్వసారస్వతప్రదా ।**
**కామత్రయం వహ్నియుక్తం రతిబిన్దువిభూషితమ్ ॥ 4**

**శ్లో॥ కూర్చయుగ్మం తథా లజ్జాయుగలం తదనన్తరమ్ ।**
**దక్షిణే కాలికే చోక్తా పూర్వవద్బీజముచ్చరేత్ ॥ 5**

**శ్లో॥ అన్తే వహ్నివధుం కుర్యాద్విద్యారాజ్ఞీ ప్రకీర్తితా ।**

**ప్రతిపదార్థం :** కామత్రయమ్ = మూడు కకారములు, వహ్నియుక్తమ్ = రకారముతో గూడి, రతిబిన్దువిభూషితమ్ = ఈంతో అలంకరింపబడి, తథా = అట్లే, కూర్చయుగ్మమ్ = కూర్చ బీజద్వయమును, లజ్జాయుగలమ్ = లజ్జా బీజద్వయమును, తదనన్తరమ్ = ఆ తరువాత, దక్షిణే కాలికే చ = దక్షిణే కాలికే యును, ఉక్తా = చెప్పబడినదై, పూర్వవత్ = ముందటివలెనే, బీజమ్ = బీజాక్షరము(ల)ను, ఉచ్చరేత్ = పలుకవలెను, అన్తే = చివర, వహ్నివధుమ్ = స్వాహా, కుర్యాద్ = చేయదగును, ఇది, సపర్యాభేద సంయుక్తా = భిన్న పూజావిధానములతో గూడి, చతుర్వర్గఫలప్రదా = నాలుగు పురుషార్థములను ఫలముగా ప్రసాదించునదైన, మహామాయా = మహామాయ, మహాభేదా = అనంతమైన భేదరూపములు

గలిగిన, మహాలయా = అన్ని భేదములను నశింపజేయు, సర్వవిద్యామహారాజ్ఞీ = అన్ని విద్యలకు మహారాణియైన, సర్వసారస్వత ప్రదా = అన్ని సాహిత్య ప్రక్రియలను ప్రసాదించు, మహావిద్యా = మహావిద్యయగు, విద్యారాజ్ఞీ = విద్యలకు రాణి (విద్యారాజ్ఞి యను పేర), ప్రకీర్తితా = ప్రస్తుతింపబడినది.

**తాత్పర్యం :** కకారము, రకారము, ఈంతో కూడిన క్రీం ను మూడుసార్లు, కూర్చబీజమైన హూంను, లజ్జాబీజమైన హ్రీంను, రెండు రెండుసార్లు ఉచ్చరించి, దక్షిణే కాలికే అని చేర్చి, మరల యథాపూర్వం క్రీంను మూడుసార్లు, హూంను రెండుసార్లు, హ్రీంను రెండు సార్లు ఉచ్చరించి స్వాహాతో ముగించి, **క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణే కాలికే క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా** అని పలికితే, అది **విద్యారాజ్ఞీ మహామంత్రం** అవుతుంది. దీనిని పూజాభేదాలతో చేర్చి జపిస్తే, అన్ని సాహిత్యప్రక్రియలు వరప్రసాదంగా లభిస్తాయి. పురుషార్థాల ఫలం లభిస్తుంది. ఈ మంత్రానికే **మహావిద్య** అనిపేరు. అధిష్ఠాన దేవత **దక్షిణకాళిక**. ఈమెనే **మహామాయ** అంటారు. ప్రపంచపు భిన్నత్వదర్శనం చేయిస్తూ, దాని అస్థిరత్వాన్ని బోధించే తల్లి కనుక. అందుకే **మహాభేదా** అని కూడా అంటారు. అట్లాగే, ఈ భిన్నత్వాన్ని లయంచేసేది కూడ ఆ తల్లియే కనుక ఆమెను **మహాలయా** అనిన్నీ అంటారు. పాంచభూతిక ప్రపంచ సత్యస్వరూపాన్ని దర్శింపజేసే విద్య కనుక ఇది **మహావిద్య**. మానవుని జీవితానికి ఫలంగా చెప్పబడే అర్థకామాల ఫలాన్నే కాక ఆ రెండింటిని పవిత్రీకరించే ధర్మనిష్ఠను, పరమఫలంగా మోక్షాన్ని కూడా ప్రసాదించేది ఈ దక్షిణ-కాళికోపాసన.



**శ్లో॥ నాత్ర చిన్తా విశుద్ధాది నారిమిత్రాదిలక్షణమ్ ॥ 6**

**శ్లో॥ నాత్ర ప్రయాసబాహుల్యం న కాయక్లేశసంభవః ।**
**అస్యాం స్మరణమాత్రేణ సిద్ధయోఽష్టౌ భవన్తి హి ॥ 7**

**ప్రతిపదార్థం :** అత్ర = ఈ సాధనలో, విశుద్ధ+ఆది = శుద్ధి మొదలైన, చిన్తా = ఆలోచన, న = లేదు, అరి = శత్రువు, మిత్ర = స్నేహితుడు, ఆది = మొదలైన, లక్షణమ్ = లక్షణము, న = లేదు; అత్ర = ఈ విషయమున, ప్రయాసబాహుల్యమ్ = నానావిధముల శ్రమ, న = లేదు; కాయ = శరీరపు, క్లేశసంభవః = బాధకలుగుట, న = లేదు, అస్యామ్ = దీనియందు, స్మరణమాత్రేణ = స్మరణమాత్రముచేత, అష్టౌ సిద్ధయః = ఎనిమిది సిద్ధులు, భవన్తి హి = కలుగుట నిశ్చయము.

**తాత్పర్యం :** ఈ సాధనలో శుద్ధిని గురించి చింతలేదు, శత్రుత్వ మిత్రత్వాది బంధ

లక్షణం లేదు, శ్రమపడవలసిన అవసరం లేదు, శరీరాన్ని నానావిధాల కష్టానికి గురిచెయ్య నక్కరలేదు. ఈ **విద్యారాజ్ఞీ మంత్రాన్ని స్మరించినంత మాత్రాన అష్టసిద్ధులు తప్పక లభించగలవు**.

విశుద్ధాది చిన్తా, అంటే, విశేషంగా శరీరశుద్ధికోసం, వాక్కు శుద్ధికోసం, మనస్సు శుద్ధికోసం ఆలోచించటం, స్నానము, ఆహారము, **శరీరశుద్ధి**. మృదువైన మధురమైన మాట **వాక్శుద్ధి**. అపకార చింతన, లాలస, క్రోధము, లోభము, గర్వము, అసూయ ఇత్యాది మనోభావాలు లేకుండా ఉండటం **మనఃశుద్ధి**. ఈ త్రికరణ శుద్ధి సాధనకే తపస్సు అని పేరు. దీనిని సాధించినవ్యక్తి పవిత్రుడై అవిభక్తుడవుతాడు (Integrated Personality) . ఇంత తపోనిష్ఠ ఈ మహావిద్య విషయంలో అక్కరలేదు. అట్లే, హఠయోగ, లంబికా యోగాదులలో చెప్పబడిన శరీరక్లేశంతో కూడిన బహుళసాధనలూ అక్కర్లేదు. మంత్రజపం చాలును. దీనికి విధినిషేధాలు లేవు. అంతమాత్రంతోనే అణిమా, మహిమా, లఘిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం అనబడే ఎనిమిది శక్తులూ సిద్ధిస్తాయి. వీనికే అష్టైశ్వర్యాలని కూడ పేరు. ఇవి ఈశ్వర శక్తులు కనుక ఐశ్వర్యాలు.



**శ్లో॥ భైరవోఽస్య ఋషిః ప్రోక్తః ఉష్ణిక్ ఛన్ద ఉదాహృతమ్ ।**
**దేవతా కాలికా ప్రోక్తా లజ్జాబీజం తు బీజకమ్ ॥ 8**

**శ్లో॥ శక్తిస్తు కూర్చబీజం స్యాదనిరుద్ధం సరస్వతీ ।**
**కవిత్వార్థే నియోగః స్యాదేవం ఋష్యాదికల్పనా ॥ 9**

**ప్రతిపదార్థం :** అస్య = ఈ మంత్రానికి, భైరవః = భైరవుడు, ఋషిః = ద్రష్ట, అని, ప్రోక్తః = చెప్పబడినాడు; ఛన్దః = ఛందస్సు, ఉష్ణిక్ = ఉష్ణిక్ గా, ఉదాహృతమ్ = వివరించబడినది; దేవతా = అధిష్ఠానదేవత, కాలికా ప్రోక్తా = కాళికగా చెప్పబడినది; బీజకమ్ తు = బీజాక్షరమేమో, లజ్జాబీజమ్ = హ్రీమ్ అనునది; శక్తిః తు = శక్తియైతే, కూర్చబీజం = హూమ్ అనునది, (ఇది) అనిరుద్ధమ్ = నిరోధింపబడక, సరస్వతీ = ప్రవహించునది, స్యాత్ = అగును; కవిత్వార్థే = కవితాధారను పొందుటకై, ఏవమ్ = ఈ విధముగా, ఋష్యాది = ఋషి మొదలగువాని, కల్పన = భావన, నియోగః స్యాత్ = నిర్ణయింపబడినదగును.

**తాత్పర్యం :** ఈ మంత్రదేవత కాళిక, భైరవుడు, ఋషి; ఛందస్సు ఉష్ణిక్; బీజము హ్రీం; శక్తి హూం; ఇది అడ్డగింపరాని ప్రవాహశక్తి; కవితాధారను పొందగోరువారు దీని

నుపాసిస్తారు. వారి జపసాధనకై ఈ మంత్రాని కీ విధంగా ఋషి, ఛందస్సు, దేవత, మంత్రబీజం, శక్తిబీజం అనునివి భావింపబడినవి.

ఋషి దర్శించినదే మంత్రము. కనుక ఋషి మంత్రద్రష్ట, వాని మూలమున లోకములో ఆ మంత్రము సుప్రతిష్ఠితము. వారు దర్శించిన దేవతారూపము నిజమునకు పాంచభౌతికరూపము కాదు, శక్తి రూపము. ఈ విద్యారాజ్ఞీమంత్రములో బీజరూపమున దేవత, శక్తి, ఆ శక్తివినియోగము ఇమిడి యున్నవి. మంత్రస్వరూపంలో ఇది ఉష్ణిక్ ఛందస్సులో నిబద్ధమైన బీజాక్షరధ్వనితరంగితమై ఉంటుంది.

ఉష్ణిక్ ఛందస్సున పాదమునకు ఏడు అక్షరాలు.

లౌకికవ్యవహారములో అన్వయించి చూచినప్పుడు, చేతనాచేతనముల కన్నిటికి తలకొక నామమున్నది. నామోచ్చారణ ధ్వనితమైనప్పుడు, వినువారి మనసులలో తాము మున్నే ఎఱిగియున్న ఆ నామధారివస్తువో, జంతువో, వృక్షమో, నరుడో, వాని తాలూకు భౌతికరూపము ప్రకాశించును. ఆ రూపమముతోడనే దాని వైయక్తిక గుణములు భాసించును. దానిని తానెట్లు వినియోగింపవచ్చునో పొడకట్టును. మంత్రము, బీజము, శక్తి, నియోగము ఇట్లు లౌకికసత్యముగ నిత్యానుభవమునందున్నదే. నా పేరొక మంత్రము. నా తండ్రి దానికి ఋషి. ఆ పేరున గల అక్షర సంఖ్యను బట్టి ఆ మంత్రఛందస్సు నిర్ణీతము. ఆ మంత్రాధిదేవతను నేను. ఆ మంత్రాక్షరములు బీజములు. వానికి నా రూపగుణముల నాకర్షించు శక్తియున్నది. నా పేరు నుచ్చరించిన వారికి నా వలన కాదగిన కార్యమున్నది. ఆ కార్యము నా వలన నెరవేరునదైనప్పుడు నా నామస్మరణ చేయుట జరుగును. మీ విషయము గూడ ఇంతియే. ఇట్టిదే యంత్ర, తంత్ర, మంత్ర, బీజములాదిగా గలవాని పారస్పరిక ప్రతిస్పందన.



**శ్లో॥ అంగన్యాసకరన్యాసౌ యథావదభిధీయతే ।**
**షడ్దీర్ఘభాజా బీజేన ప్రణవాద్యేన కల్పయేత్ ॥ 10**

**శ్లో॥ హృదయాయ నమః ప్రోక్తం శిరసే వహ్నివల్లభా ।**
**శిఖాయై వషడిత్యుక్తం కవచాయ హుమీరితమ్ ॥ 11**

**శ్లో॥ నేత్రత్రయాయ వౌషట్ స్యాదస్త్రాయ ఫడితి క్రమః ।**

**ప్రతిపదార్థం :** అంగన్యాసకరన్యాసౌ = అంగన్యాసము, కరన్యాసము, యథావత్ = చేయవలసిన రీతిలో, అభిధీయతే = పలుకబడవలెను; ప్రణవ+ఆద్యేన = మొదట 'ఓం'తో,

షట్ = ఆరు, దీర్ఘభాజా = దీర్ఘములైన, బీజేన = బీజాక్షరముతో, కల్పయేత్ = చేయవలెను; హృదయాయ నమః = హృదయమునకై నమస్కారము; శిరసే = శిరస్సునకై, వహ్నివల్లభా = స్వాహా, శిఖాయై = శిఖకై, వషట్ ఇతి = వషట్ అని, ఉక్తమ్ = చెప్పబడినది; కవచాయ = కవచమునకై, హుమ్ + ఈరితమ్ = హుమ్ చెప్పబడినది; నేత్రత్రయాయ = మూడుకన్నులకై, వౌషట్ = వౌషట్ (అనునది), స్యాత్ = అగును; అస్త్రాయ = అస్త్రమునకై, ఫట్ = ఫట్, ఇతి అని, క్రమః = ఈ క్రమము, ప్రోక్తమ్ = చెప్పబడినది.

**తాత్పర్యం :** అంగన్యాస కరన్యాసాలు ఈ క్రమంలో చెప్పబడినవి :-

**అంగన్యాసము:** **ఓం క్రాం హృదయాయ నమః ।**
**ఓం క్రీం శిరసే స్వాహా ।**
**ఓం క్రూం శిఖాయై వషట్ ।**
**ఓం క్రైం కవచాయ హుమ్ ।**
**ఓం క్రౌం నేత్రత్రయాయ వౌషట్ ।**
**ఓం క్రః అస్త్రాయ ఫట్ ।**

**కరన్యాసము :** **ఓం క్రాం అంగుష్ఠాభ్యాం నమః ।**
**ఓం క్రీం తర్జనీభ్యాం స్వాహా ।**
**ఓం క్రూం మధ్యమాభ్యాం వషట్ ।**
**ఓం క్రైం అనామికాభ్యాం హుమ్ ।**
**ఓం క్రౌం కనిష్ఠికాభ్యాం వౌషట్ ।**
**ఓం క్రః కరతలకరపృష్ఠాభ్యాం ఫట్ ।**

**శ్లో॥ ఏవం యథావిధిం కృత్వా వర్ణన్యాసం సమాచరేత్ ॥ 12**

**ప్రతిపదార్థం :** ఏవమ్ = ఈ విధముగా, యథావిధిమ్ = వేద విధానముననుసరించి, కృత్వా = చేసి, వర్ణన్యాసమ్ = వర్ణన్యాసమును, సమాచరేత్ = ఆచరింపవలెను.

**తాత్పర్యం :** వేదవిహితమైన పద్ధతిలో ఇట్లు అంగన్యాస కరన్యాసములు చేసిన తరువాత వర్ణన్యాసము చేయవలెను.

ఇదెట్లు చేయవలెనో తర్వాతి శ్లోకములలో వివరించబడుచున్నది.

---

**శ్లో॥ వర్ణన్యాసం ప్రవక్ష్యామి యేన దేవీమయో భవేత్ ।**
**అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ వై హృదయం స్పృశేత్ ॥13**

శ్లో॥ ఏ ఐ ఓ ఔ తతోఽప్యం అః క ఖ గ ఘ పునస్తతః ।
ఉక్త్వా చ దక్షిణం భుజం స్పృశేత్ సాధక ఉత్తమః ॥ **14**

శ్లో॥ ఙ చ ఛ జ సముచ్చార్య ఝ ఞ ట ఠ డ ఢ తథా ।
ఇతి వామభుజే న్యస్య ణ త థ ద పునః స్మరేత్ ॥ **15**

శ్లో॥ ధ న ప ఫ బ భ ఇతి దక్షిణజంఘకే న్యసేత్ ।
మ య ర ల వ శ ష స హ క్ష వామజంఘకే ।
ఇతి వర్ణాన్ ప్రవిన్యస్య మూలవిద్యాం సముచ్చరన్ ॥ **16**

శ్లో॥ సప్తధా వ్యాపకం కుర్యాద్యేన దేవీమయో భవేత్ ।
వ్యాపకత్వేన సంన్యస్య తతో ధ్యాయేత్పరాం శివామ్ ॥ **17**

**ప్రతిపదార్థం :** వర్ణన్యాసమ్ = వర్ణన్యాసమును, ప్రవక్ష్యామి = చెప్పుదును, యేన = దేనిచేత, దేవీమయః = దేవీమయుడు, భవేత్ = అగునో:- అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ లూ = ఈ చెప్పబడిన వర్ణములు, వై = నిశ్చయముగా, హృదయమ్ = హృదయమును, స్పృశేత్ = తాకవలెను; ఏ ఐ ఓ ఔ = ఈ వర్ణములు, తతః అపి = ఆ మీదట కూడ, అం అః క ఖ గ ఘ = అను ఈ వర్ణములు, పునః = మరల, తతః = ఆపై, ఉక్త్వా చ = పలికి, దక్షిణం భుజం = కుడి భుజమును, ఉత్తమః సాధకః = ఉత్తమ సాధకుడు, స్పృశేత్ = తాకవలెను; ఙ చ ఛ జ సముచ్చార్య = ఙ చ ఛ జ లను చక్కగా ఉచ్చరించి, తథా = అట్లే, ఞ ట ఠ డ ఢ ఇతి = ఞ ట ఠ డ ఢ అని, వామ = ఎడమ, భుజే = భుజముపై, న్యస్య = ఉంచి, ణ త థ ద పునః = ణ త థ ద లను కూడ, స్మరేత్ = స్మరించవలెను; ధ న ప ఫ బ భ ఇతి = ధ న ప ఫ బ భ అని, దక్షిణ = కుడి, జంఘకే = తొడపై, న్యసేత్= న్యాసము చేయవలెను, మ య ర ల వ శ ష స హ క్ష = ఈ వర్ణములను పలికి, వామ జంఘకే = ఎడమ తొడపై, న్యసేత్ = తాకవలెను; ఇతి = ఈ విధముగా, వర్ణాన్ = వర్ణములను, ప్రవిన్యస్య = విన్యాసము చేసి, మూలవిద్యామ్ = ద్వావింశత్యక్షరీవిద్యారాజ్ఞీమంత్రమును, సముచ్చరన్ = పలుకుచు, సప్తధా = ఏడుసార్లు, వ్యాపకమ్ = వ్యాపకాంజలి ముద్రను, కుర్యాత్ = చేయదగును, యేన = దానివలన, దేవీమయః = దేవీమయుడు, భవేత్ = అగును; వ్యాపకత్వేన = వ్యాపకాంజలి ముద్రతో, సంన్యస్య = చక్కగా న్యాసము చేసి, తతః = ఆపై, పరాం శివామ్ = పరాశక్తిని, ధ్యాయేత్ = ధ్యానింపవలెను.

**తాత్పర్యం :** ఈ చెప్పబడిన విధంగా వర్ణన్యాసం చేయటం వలన సాధకుడు ఉత్తమ సాధకుడై దేవీమయుడవుతాడు. ఆ వర్ణన్యాసక్రమం ఇది :-

1) అ నుండి ఞ వరకు పలుకుతూ హృదయస్థానాన్ని (ఛాతిలో కుడివైపు) తాకవలెను;
2) ఏ నుండి ఘ వరకు పలుకుతూ కుడిభుజాన్ని తాకవలెను.
3) జ నుండి ధ వరకు పలుకుతూ ఎడమభుజాన్ని తాకవలెను.
4) ణ నుండి భ వరకు పలుకుతూ కుడితొడను తాకవలెను.
5) మ నుండి క్ష వరకు పలుకుతూ ఎడమతొడను తాకవలెను.

ఈ వర్ణన్యాసము తరువాత మూలమంత్రాన్ని **క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణే కాలికే క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా,** అని జపిస్తూ వ్యాపకాంజలి ముద్రను ఏడుసార్లు చేయవలెను. ఆపై పరాశక్తిని ధ్యానించవలెను. దీనివలన సాధకుని శరీరము దేవీమయమై ఆతడు శక్తిమంతుడు కాగలడు.

---

**శ్లో॥ పీఠన్యాసం తతః కుర్యాద్యేన దేవీమయో భవేత్ ।**
**హృత్సరోజే సుధాసిన్ధుః మధ్యే ద్వీపం సువర్ణజమ్ ॥ 18**

**శ్లో॥ పరితః పారిజాతాశ్చ మధ్యే కల్పతరుం తతః ।**
**తన్మూలే హేమనిర్మాణం ద్వాశ్చతుష్టయభూషితమ్ ॥ 19**

**శ్లో॥ మణ్డపం మన్దవాతేన పరాక్రాన్తం సుధూపితమ్ ।**
**మన్త్రం తత్ర ప్రతిష్ఠాప్య తత్ర పూజాం సమాచరేత్ ॥ 20**

**శ్లో॥ శ్మశానం తత్ర సంపూజ్య తత్ర కల్పద్రుమం యజేత్ ।**
**తన్మూలే మణిపీఠం చ నానామణివిభూషితమ్ ॥ 21**

**ప్రతిపదార్థం :** తతః = అటుపైన, యేన = దేనిచేత, దేవీమయః భవేత్ = (సాధకుడు) దేవీమయుడగునో, అట్టి, పీఠన్యాసం = పీఠన్యాసమును ( పీఠముయొక్క ఏర్పాటును), హృత్ సరోజే = హృదయపద్మమున, సుధాసిన్ధుః = అమృతసముద్రము, మధ్యే = దాని నడుమ, సువర్ణజమ్ = బంగారు, ద్వీపమ్ = ద్వీపమును, పరితః = చుట్టూగల ప్రదేశమున, పారిజాతాః చ = పారిజాతవృక్షములున్నూ, మధ్యే = వానిమధ్య, కల్పతరుమ్ = కల్పవృక్షమును, తతః = తరువాత, తన్మూలే = ఆ కల్పవృక్షపు మొదలు భాగమున, ద్వాశ్చతుష్టయభూషితమ్ = ఎనిమిది అలంకరింపబడిన, హేమనిర్మాణం = బంగారు ద్వారములుగలది, మన్దవాతేన = మెల్లగ వీచే గాలిచే, సుధూపితమ్ = సువాసన గలదిగా, పరాక్రాన్తమ్ = వ్యాపింపబడిన, మణ్డపమ్ = మండపమును, తత్ర = అచట, మన్త్రమ్ = మంత్రమును, ప్రతిష్ఠాప్య = ప్రతిష్ఠించి, తత్ర = అచట, పూజామ్ = పూజను, సమాచరేత్

= చేయవలెను; తత్ర = అచట, శ్మశానమ్ = శ్మశానమును, తత్ర = అచట, కల్పద్రుమమ్ = కల్పవృక్షమును, సంపూజ్య = పూజించి, తన్మూలే = దాని మొదలు ప్రదేశమున, నానామణివిభూషితమ్ = అనేక విధములైన మణులతో అలంకరింపబడిన, మణిపీఠమ్ = మణిపీఠమును, యజేత్ = పూజింపవలెను.

**తాత్పర్యం :** ఇప్పుడిక ఈ విధముగా పీఠన్యాసము చేయవలెను. దీనివలన సాధకుడు దేవీమయుడవుతాడు. పీఠన్యాస విధానం ఇది :- సాధకుడు తన హృదయంలో అమృతసముద్రాన్ని భావించి, దానిలో సువర్ణమయమైన ఒక ద్వీపాన్ని, ఆ ద్వీపంలో అష్టదిక్కులలోను పారిజాత వృక్షాలను, వాని మధ్య ఒక కల్పవృక్షాన్నీ, దాని మొదట బంగారపు ద్వారములను, మెల్లగా వీచే సువాసనగల గాలిని, భావించవలె. ఈ మండపమును దాటి శ్మశానమును, దానిమధ్య కల్పవృక్షాన్నీ భావించి, దాని మూలంలో మంత్ర తంత్రాన్ని స్థాపించి పూజ చేయవలె. ఆ కల్పవృక్షపు మొదట మణిమయపీఠాన్ని భావించవలె.

**శ్లో॥ నానాలంకారభూషాఢ్యం మునిదేవైశ్చ భూషితమ్ ।**
**శివాభిర్బహుమాంసాస్థిమోదమానాభిరన్తతః ॥ 22**

**శ్లో॥ చతుర్దిక్షు శవముణ్డాశ్చితాఙ్గారాస్థిభూషితాః ।**
**ఇచ్ఛాజ్ఞానక్రియా చైవ కామినీ కామదాయినీ ॥ 23**

**శ్లో॥ రతీ రతిప్రియా నన్దా మధ్యే చైవ మనోన్మనీ ।**
**హసౌః సదాశివేత్యుక్త్వా మహాప్రేతేతి తత్పరమ్ ।**
**పద్మాసనాయ హృదయాం పీఠన్యాస ఉదాహృతః ॥ 24**

**శ్లో॥ ఏవం దేహమయే పీఠే చిన్తయేదిష్టదేవతామ్ ।**
**ధ్యానమస్యాః ప్రవక్ష్యామి స్మరణాచ్ఛివతాం వ్రజేత్ ॥ 25**

**ప్రతిపదార్థం :** నానాలంకారభూషాఢ్యమ్ = అనేక విధముల అలంకారములు, ఆభరణములు కలిగి, మునిదేవైః = మునులు దేవతలచేత, చ = కూడ, భూషితమ్ = పొగడబడినదై, బహు = చాలా, మాంస = మాంసము, అస్థి = ఎముకలు, వీనిచే, అన్తతః = అంతటను, పూర్తిగా, మోదమానాభిః = సంతోషించుచున్న, శివాభిః = నక్కలచే, చతుః + దిక్షు = నాలుగు దిక్కుల, శవముణ్డా = శవముల మొండెములు, చిత = చితులయొక్క, అఙ్గార = నిప్పులచే, అస్థి = ఎముకలచే, భూషితాః = అలంకరింపబడిన, ఇచ్ఛాజ్ఞానక్రియా చైవ = ఇచ్ఛాజ్ఞానక్రియలే, కామినీ = కామిని, కామదాయినీ = కోరికలు తీర్చునది, రతీ = రతి

లేక ఆసక్తి, రతిప్రియా = సంభోగ మందిష్టముగలిగి, నన్దా = సంతోషించునది, మధ్యే చైవ = మధ్యలో, మనోన్మనీ = మనోన్మణి, హసౌః = వీని ఆధారమున, మహాప్రేతా = మహాప్రేత, ఇతి = అని, తత్పరమ్ = దానిపైగల, సదాశివా = సదాశివా, ఇతి = అని, ఉక్త్వా = పలికి, పద్మాసనాయ = పద్మమైన ఆసనమునకై, హృదయమ్ = హృదయము, పీఠన్యాస = పీఠముగా ఉంచబడినదిగా, ఉదాహృతః = చెప్పబడినది; ఏవమ్ = ఇట్లు, దేహమయే పీఠే = దేహమే పీఠమైనదిగా, ఇష్టదేవతామ్ = తన ఇష్టదేవతను, చిన్తయేత్ = చింతించవలెను; అస్యాః = ఆ దేవతయొక్క, ధ్యానమ్ = ధ్యాన విధానమును, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను; స్మరణాత్ = ధ్యానమువలన, శివతామ్ = శివత్వమును, వ్రజేత్ = పొందును.

**తాత్పర్యం :** ముందు శ్లోకములలో చెప్పబడిన పీఠన్యాసము తరువాత, ఆ పీఠముపై సాధకుడు తన ఇష్టదేవతను నిలుపవలెను. ఆ పీఠము వాని హృదయపద్మమే అను భావన ఉండవలెను. ఆ ఇష్టదేవతను తాను అర్చించుచుండగా మునులు దేవతలు సూక్ష్మరూపములలో చుట్టుమూగి యుందురు. ఈ పీఠము, అర్చన జరుగుచునే యుండగా పూర్వోక్త శ్మశానభావనలో మండుచున్న చితులు, శవముల మొండెములు, మాంసము, ఎముకలు, వానిని తృప్తిగా తిని అంతటనూ తిరుగాడు నక్కలు దృశ్యమానము కావలె. వాని మధ్య మహాప్రేతయైన శివునిపై, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, కామినీశక్తి, కామదాయినీ శక్తి, రతిశక్తి, రతిప్రియాశక్తి, నన్దాశక్తి, అను అష్టశక్తుల నడుమ మనోన్మణిశక్తి దీపించవలె. ఈ శక్తుల ఆధారముతోనే **హసౌః** అను పర్యాయనామముగల సదాశివుని శరీరపీఠముపై మహాకాళి దర్శనమిస్తుంది. ఆమెను ధ్యానించు విధానము చెప్పబడును. ఆ ధ్యానమువలన సాధకుడు శివత్వమును పొందగలడు.



**శ్లో॥ కరాలవదనాం ఘోరాం ముక్తకేశీం చతుర్భుజామ్ ।**
**కాలికాం దక్షిణాం దివ్యాం ముణ్డమాలావిభూషితామ్ ॥ 26**

**శ్లో॥ సదా చ్ఛిన్నశిరఃఖడ్గవామాధ్యోర్ధ్వకరామ్బుజామ్ ।**
**అభయం వరదం చైవ దక్షిణోర్ధ్వాధపాణికామ్ ॥ 27**

**శ్లో॥ మహామేఘప్రభాం శ్యామాం తథా చైవ దిగమ్బరీమ్ ।**
**కణ్ఠావసక్తముణ్డాలీం గలద్రుధిరచర్చితామ్ ॥ 28**

**ప్రతిపదార్థం :** కరాలవదనామ్ = భయంకరమైన ముఖముగలదానిని, ఘోరామ్ = రాత్రివలె నల్లని రంగుగల దానిని, ముక్తకేశీమ్ = విరబోసిన జుత్తుగలదానిని, చతుర్భుజామ్ = నాలుగు భుజములు గలదానిని, దివ్యామ్ = దివ్యమైన దానిని (తేజోమయమైన దానిని), ముణ్డమాలావిభూషితామ్ = తలపుఱ్ఱెలదండచే అలంకరింపబడినదానిని, సదా = ఎల్లపుడు, ఛిన్నశిరః = తెగిన తలను, ఖడ్గ = కత్తిని, వామ = ఎడమ, అద్య = క్రింది, ఊర్ధ్వ = పైనగల, కరామ్బుజామ్ = పద్మముల బోలిన చేతులు గల దానిని, అభయమ్ = అభయ–ముద్రను, వరదమ్ = వరద ముద్రను, చ ఏవ = కూడ, దక్షిణ = కుడిప్రక్కన, ఊర్ధ్వ = పైన, అధ = క్రిందగల, పాణికాం = చేతులు గలదానిని, మహామేఘప్రభామ్ = దట్టమైన మబ్బు వెలుగువంటి, శ్యామామ్ = నల్లని దేహకాంతిగల దానిని, తథా చ ఏవ = అట్లే, దిగమ్బరీమ్ = వివస్త్రయైన దానిని, కణ్ఠావసక్త = కంఠమునంటియున్న, ముండాలీమ్ = తలపుఱ్ఱెలు గలదానిని, గలత్ = జారుచున్న, రుధిర = రక్తమును, చర్చితామ్ = మైపూతగా గలదానిని, దక్షిణామ్ కాలికామ్ = దక్షిణకాళికను,

**శ్లో॥ కర్ణావతంసమానీతాం శవయుగ్మభయానకామ్ ।**
**ఘోరదంష్ట్రాం కరాలాస్యాం పీనోన్నతపయోధరామ్ ॥ 29**

**శ్లో॥ శవానాం కరసంఘాతైః కృతకాఞ్చీం హసన్ముఖీమ్ ।**
**సృక్కద్వయే గలద్రక్తధారాం విస్ఫురితాననామ్ ॥ 30**

**ప్రతిపదార్థం :** కర్ణావతంసమానీతామ్ = కర్ణభూషలుగానైన, శవయుగ్మ = శవముల జంటతో, భయానకామ్ = భయము కలిగించుదానిని, ఘోరదంష్ట్రామ్ = భయంకరమైన పలువరుస గలదానిని, కరాలాస్యామ్ = భయంకరమైన ముఖము గలదానిని, పీన = బలిసిన, ఉన్నత = ఎత్తైన, పయోధరామ్ = చన్నవ గలదానిని, శవానామ్ = శవములయొక్క, కరసంఘాతైః = చేతుల సమూహములచే, కృత = చేయబడిన, కాఞ్చీమ్ = నడుము భాగము గలదానిని (మొలనూలు కలదానిని), హసన్ముఖీమ్ = నవ్వుముఖము గల దానిని, సృక్కద్వయే = పెదవుల మూలలందు, గలత్ = జారుచున్న, రక్తధారామ్ = నెత్తుటిచాలు గలదానిని, విస్ఫురితాననాం = ప్రకాశించు ముఖము గలదానిని,

**శ్లో॥ ఘోరరావాం మహారౌద్రీం శ్మశానాలయవాసినీమ్ ।**
**బాలార్కమణ్డలాకారలోచనత్రితయాన్వితామ్ ॥ 31**

**ప్రతిపదార్థం :** ఘోరరావామ్ = భయంకరమైన కంఠస్వరము గలదానిని, మహారౌద్రీమ్ = అమితమైన కోపమముగల వినాశకారిణిని, శ్మశానాలయవాసినీమ్ = శ్మశానమే

ఆలయముగా నివసించుదానిని, బాల = ఉదయకాల, అర్కమణ్డల = సూర్యమండలపు, ఆకార = రూపముగల, లోచనత్రితయాన్వితామ్ = మూడుకన్నులు గలదానిని,

**శ్లో॥ దన్తురాం దక్షిణవ్యాపిముక్తాలమ్బికచోచ్ఛ్రయామ్ ।**
**శవరూప మహాదేవ హృదయోపరి సంస్థితామ్ ॥ 32**

**శ్లో॥ మహాకాలేన చ సమం విపరీతరతాతురామ్ ।**
**శివాకోటిసహస్రైస్తు యోగియోగవిరాజితామ్ ॥ 33**

**శ్లో॥ రక్తపూర్ణాం రవాంభోజాం మద్యపానప్రసన్నకామ్ ।**
**వహ్న్యర్కశశినేత్రాం చ రక్తవిస్ఫురితాననామ్ ॥ 34**

**శ్లో॥ యోగినీచక్రసంయుక్తాం కాలికాం భావయేత్సదా ।**
**ఏవం సఞ్చిన్త్య కాలీం తు శ్మశానాలయవాసినీమ్ ॥ 35**

**ప్రతిపదార్థం :** దన్తురామ్ = పొడవైన కోరలు గలదానిని, దక్షిణవ్యాపి = కుడి భాగమున వ్యాపించియున్న, ముక్తాలమ్బి = వదులుగా వ్రేలాడు (కదలు), కచ + ఉచ్ఛ్రయామ్ = వెంట్రుకల సమూహము గలదానిని, శవరూప = శవరూపమున (అచేతనుడై) యున్న, మహాదేవ = మహాదేవుని (శివుని), హృదయ + ఉపరి = హృదయముపై, సంస్థితామ్ = అధిష్ఠించినదానిని, చ = మరియు, మహాకాలేన సమమ్ = మహాకాలునితోగూడ, విపరీతరత + ఆతురామ్ = విపరీతరతికై ఉత్సుకత గలదానిని, శివాకోటిసహస్రైః తు = నక్కల గుంపులతో, యోగియోగ = కూడిన కలయికతో, విరాజితామ్ = ప్రకాశించు దానిని, రక్తపూర్ణామ్ = రక్తముతో నిండినదానిని (నెత్తుటి ముద్దయైన దానిని, రవ = కంఠధ్వనితో, అంభోజామ్ = ఆకాశమునాక్రమించినదానిని, మద్యపాన = మద్యమును త్రాగుటవలన, ప్రసన్నకామ్ = ప్రసన్నయైన దానిని, వహ్ని + అర్క + శశి + నేత్రామ్ = అగ్ని, సూర్యుడు, చంద్రుడు కన్నులుగా గలదానిని, చ = మరియు, రక్తవిస్ఫురిత + ఆననామ్ = రక్తముతో ప్రకాశించు ముఖము గలదానిని, యోగినీచక్రసంయుక్తామ్ = యోగినుల వలయముతో గూడినదానిని, కాలికామ్ = కాళికను, ఏవం = ఇట్లు, సంచిన్త్య తు = స్మరించి, సదా = ఎల్లప్పుడు, భావయేత్ = ధ్యానింపవలెను.

**తాత్పర్యం (శ్లో.26-35) :** కాళి శ్మశానవాసిని. యోగినులామె చుట్టూ పరివేష్ఠించి యుందురు. ఆమె త్రిణేత్రి: అగ్ని, సూర్యుడు, చంద్రుడు ఆమె కన్నులు. ఆమె శరీరము, ముఖము రక్తసిక్తమై, అరుణమై యుండును. ఆమె మద్యమును సేవించి, శాంతయై ప్రసన్నయైన మూర్తి. ఆమె కంఠధ్వని ఆకాశమునాక్రమించునది. ఆమె చుట్టు నక్కల గుంపులు తిరుగాడు చుండును. అవి ఆ శ్మశానమున రక్తమాంసభుక్తివలన సంతృప్తి

జెందినవి. ఆమె పొడవైన కోరలు చాచి, తన కుడి వైపున వ్యాపించి ముడివీడిన కేశములతో, దట్టమైన కారుమబ్బువర్ణములో నల్లగా వెలుగొందుమూర్తి. ఆమె మెడలో తలపుఱ్ఱెల మాల, కారుచున్న రక్తము మైపూతగా నున్న దిగంబరి. భయంకరమైన దర్శనము గలది. ఆమె ఎడమ ప్రక్క రెండుచేతులలో, పైచేత ఖడ్గము ధరించి, క్రింది చేత ఖండిత శిరస్సును జుట్టుపట్టి యుండగా, కుడిప్రక్క రెండు చేతులలో పై చేత అభయ ముద్రను, క్రింది చేత వరదముద్రను దాల్చియుండును. ఆమె నడుముచుట్టు శవముల తెగిన చేతులు మొలనూలుగా నుండును. రెండు చెవులకును శవములు కర్ణావతంసములై అలంకారముగ నుండును. పెదవుల మూలల రక్తధారలు కారుచుండును. ఎత్తైన ఒత్తైన పాలిండ్లతో అలరారు తల్లియామె. ఆమె శవరూప మహాదేవుని హృదయముపై నెక్కి, మహాకాలునితో విపరీత రతియందు ఆసక్తయై యుండును. ఈ రూపమును మనసున భావించి ధ్యానించవలెను.

---

**శ్లో॥ అనుష్ఠానవిధిం వక్ష్యే దేవ్యాస్సర్వసమృద్ధిదామ్ ।**
**యేనానుష్ఠితమాత్రేణ భవాబ్ధౌ న నిమజ్జతి ॥ 36**

**ప్రతిపదార్థం :** సర్వసమృద్ధిదామ్ = అన్నిట సమృద్ధిని కలిగించు, దేవ్యాః = దేవియొక్క, అనుష్ఠానవిధిమ్ = అనుష్ఠానవిధానాన్ని, వక్ష్యే = చెప్పుదును, యేన = దేనిని, అనుష్ఠిత-మాత్రేణ = అనుష్ఠించిన మాత్రాన, భవాబ్ధౌ = సంసారసాగరమున, న నిమజ్జతి = మునుగడు.

**తాత్పర్యం :** దేవియొక్క అనుష్ఠానపద్ధతిని చెప్పుదును. ఈ అనుష్ఠానము వలన అన్ని విషయములలో సమృద్ధి లభించును, సంసార సముద్రంలో మునిగి పోకుండ నిలచును.

సర్వసమృద్ధి అంటే, ఒక సంసారి సాధారణంగా సుఖజీవనానికి అవసరమని భావించే తిండి, బట్ట, ఇల్లు మాత్రమే కాక ధనధాన్య సంతాన స్థిరచరాస్తులన్నీ అవసరాన్ని మించి లభిస్తాయని భావం. ఈ కారణంగా యోగక్షేమాలు కలిగి జీవితం సుఖమయ మవుతుంది.

---

**శ్లో॥ అనేకకాఞ్చనరత్నాది మాణిక్యరససిద్ధిదమ్ ।**
**ఇన్ద్రాదిసురవృన్దానాం సాధనైకఫలప్రదమ్ ॥ 37**

**శ్లో॥ విపక్షకులసంహారకారణం శరణప్రదమ్ ।**
**శాన్తికం పౌష్టికం చైవం వశీకరణముత్తమమ్ ॥ 38**

శ్లో॥ మారణోచ్చాటనం కర్మాకర్షీకరణముత్తమమ్ ।
సమస్తశోకశమనమానన్దవిధూదయమ్ ॥ 39

శ్లో॥ చతుః సముద్రపర్యన్తాం మేదినీం సాధకోత్తమమ్ ।
స్త్రీరత్నకులసందాయి పుత్రపౌత్రాదివర్ధనమ్ ॥ 40

**ప్రతిపదార్థం :** అనేక = లెక్కలేనన్ని, కాఞ్చన = బంగారము, రత్న+ఆది = రత్నములు మొదలగువానిని, మాణిక్య = మాణిక్యములను, రససిద్ధిదామ్ = రససిద్ధిని ప్రసాదించునది, ఇన్ద్ర + ఆది = ఇంద్రుడు మొదలగు, సురవృన్దానామ్ = దేవతాబృందములకు, సాధన + ఏకఫలదమ్ = (వారి) సాధనల ఫలము నిచ్చునది, విపక్షకుల = శత్రువులయొక్క, సంహారకారణామ్ = నాశనమునకు కారణమైనది, శరణప్రదమ్ = కోరినవారికి శరణిచ్చునది, శాన్తికమ్ = శాన్తిని కలిగించునది, పౌష్టికం = పుష్టిని కలిగించునది, చ = కూడ, ఏవం = ఇట్లే, ఉత్తమమ్ = ఉత్తమమైన, వశీకరణమ్ = వశీకరణమునుగూడ, మారణ = చంపుట, ఉచ్చాటనం = భూతప్రేత పిశాచాదులను పారద్రోలుట, కర్మ + ఆకర్షీకరణమ్ + ఉత్తమమ్ = ఉత్తమమైన ఆకర్షణమును కలిగించునది, సమస్తశోకశమనమ్ = అన్ని శోకములను శాంతింప జేయునది, ఆనన్దవిధూదయమ్ = ఆనందము అను చంద్రుని ఉదయింపజేయునది, చతుః సముద్రపర్యన్తాం మేదినీమ్ = నాలుగు సముద్రముల వరకు వ్యాపించిన భూమిని, సాధకోత్తమమ్ = సాధకులకు మంచిది, స్త్రీరత్నకులసందాయి = ఉత్తమస్త్రీలనిచ్చునది, పుత్రపౌత్ర + ఆదివర్ధనమ్ = కొడుకుల, మనుమలు మొదలుగా వంశమును వృద్ధిచేయునది,

**తాత్పర్యం :** పై జెప్పిన అనుష్ఠానము వలన బంగారము, రత్నములు, మాణిక్యములు మొదలగు సంపద కలుగును. కాళీమాత దేవతలకు సైతము వారి సాధనల ఫలమును ప్రసాదించునది. శత్రునాశనము చేసి, అభయమిచ్చి, శాన్తిని, పుష్టిని, వశీకరణశక్తిని కలిగించునది. శత్రువును చంపుటకును, ఆకర్షణ కలిగించుటకును, అన్నివిధముల దుఃఖములను శాంతింపజేయుటకును, ఆనందము పొందుటకును, నాలుగు సముద్రముల వరకు వ్యాపించిన భూమిని సాధించుటకును, ఉత్తమస్త్రీలను, పుత్రపౌత్రాభివృద్ధిగ వంశము నిలుచుటకును ఉత్తమమైన సాధనము ఈ అనుష్ఠానము. దీనివలన యే లోహమునైన బంగారముగా మార్చగల రససిద్ధి కలుగును.

శ్లో॥ ఆదౌ యన్త్రం ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమరతాం వ్రజేత్ ।
ఆదౌ త్రికోణం విన్యస్య త్రికోణన్తు బహిర్న్యసేత్ ॥ 41

**శ్లో॥ తతో వై విలిఖేన్మన్త్రీ త్రికోణత్రయముత్తమమ్ ।**
**వృత్తం విలిఖ్య విధివల్లిఖేత్ పద్మం సులక్షణమ్ ॥ 42**

**ప్రతిపదార్థం :** ఆదౌ = మొదట, యద్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, అమరతామ్ = దేవత్వమును, వ్రజేత్ = పొందునో, (తత్ = అట్టి), యన్త్రమ్ = యంత్రమును, ప్రవక్ష్యామి = చెప్పుదును; ఆదౌ = మొదట, త్రికోణమ్ = త్రికోణమును, విన్యస్య = వ్రాసి, త్రికోణం తు = త్రికోణమేమో వెలుపల వ్రాయవలెను; తతః వై = ఆ తరువాత, మన్త్రీ = మంత్రవేత్త, ఉత్తమమ్ = చక్కని, త్రికోణత్రయమ్ = మూడు త్రికోణములను, విలిఖేత్ = వ్రాయవలెను; వృత్తమ్ = వృత్తాకారమును, విలిఖ్య = వ్రాసి, సులక్షణమ్ = దోషములేని, పద్మమ్ = పద్మాకారమును, విధివత్ = శాస్త్రము నిర్దేశించిన విధముగా, లిఖేత్ = వ్రాయవలెను.

**తాత్పర్యం :** ఏ యంత్రమును తెలిసికొనుటవలన దేవత్వము సిద్ధించునో ఆ యంత్రమును మొదట చెప్పెదను. మొదట అధోముఖముగా నున్న త్రికోణమును వ్రాసి, దానిని కేంద్రముగా చేసికొని నాలుగు దిక్కుల నాలుగు త్రికోణములను వ్రాయవలెను. ఇవి యన్నియు సమముగా నుండవలయును. ఈ త్రికోణముల కేంద్రమును స్థిరీకరించి దానినుండి వెలుపల ఒక వృత్తమును వానిచుట్టు నుండునట్లు వ్రాయవలెను. ఆ వృత్తమునకు వెలుపల ఒక అష్టదళ పద్మమును (ఎఱ్ఱచందనముతో) వ్రాయవలెను. ఆ పద్మమునకు వెలుపల మరియొక వృత్తమును వ్రాసి, ఆ వృత్తమునకు వెలుపల నాలుగు ద్వారములుగల చతురస్ర భూపురమును వ్రాయవలెను. మొదట వ్రాసిన కేంద్రీయ త్రికోణమున ఒక ఎఱ్ఱని చుక్క, రెండు, క్రీం క్రీం అను బీజములను వ్రాయవలయును.



**శ్లో॥ పీఠపూజాం తతః కృత్వా వామే చార్ఘ్యం ప్రకల్పయేత్ ।**
**మూలవిద్యాం షడఙ్గేన మూలమన్త్రేణ పూజయేత్ ॥ 43**

**శ్లో॥ తతో హృదయపద్మాన్తే స్ఫురన్తీం సంవిదాకలామ్ ।**
**యన్త్రమధ్యే సమావాహ్య న్యాసజాలం ప్రవిన్యసేత్ ॥ 44**

**శ్లో॥ తతో ధ్యాత్వా మహాదేవీముపచారాన్ ప్రకల్పయేత్ ।**
**నమస్కృత్య మహాదేవీం తతశ్చావరణం చరేత్ ॥ 45**

**ప్రతిపదార్థం :** తతః = అప్పుడు, ఆ తరువాత, పీఠపూజాం కృత్వా = పీఠమును పూజించి, వామే = ఎడమ దిక్కుగా, అర్ఘ్యం = అర్ఘ్యమునకై జలమును, ప్రకల్పయేత్ = ఏర్పరించ వలెను, మూలవిద్యామ్ = మూలవిద్యను, మూలమన్త్రేణ = మూల మంత్రముతో, షడఙ్గేన

= షడంగములతో, పూజయేత్ = పూజింపవలెను; తతః = ఆ తరువాత, హృదయపద్మాన్తే = హృదయపద్మమునందు, స్ఫురన్తీమ్ = ప్రకాశించుచున్న, సంవిదాకలామ్ = పరమజ్ఞాన–కళారూపిణిని, యన్త్రమధ్యే = యంత్రమధ్యమున, సమావాహ్య = చక్కగా ఆవాహన చేసి, న్యాసజాలమ్ = అంగన్యాసకరన్యాసాదులను, ప్రవిన్యసేత్ = సమర్పించవలెను; తతః = అటుపై, మహాదేవీమ్ = మహాదేవిని, ధ్యాత్వా = ధ్యానించి, ఉపచారాన్ = షోడశోప–చారములను, ప్రకల్పయేత్ = అర్పించవలెను; మహాదేవీం = మహాదేవిని, నమస్కృత్య = నమస్కరించి, తతః = తరువాత, ఆవరణం చ = ఆవరణమును కూడ, చరేత్ = పూజింప వలెను.

**తాత్పర్యం :** ఆ తరువాత పీఠపూజ చేసి, ఎడమవైపున అర్ఘ్య జలాన్నుంచి, మూలవిద్యను మూలమంత్రంతో షడంగపూజచేసి, ఆపై సాధకుని హృదయపద్మంలో ప్రకాశించే సంవిద్రూపదేవిని యంత్రమధ్యంలో శ్రద్ధగా ఆవాహన చేసి, అంగన్యాస కరన్యాస వర్ణన్యాసాదులతో అర్చించి, అటుపై మహాదేవిని ధ్యానించి, షోడశోపచారాలను చేసి, నమస్కరించి, ఆపై ఆవరణాన్ని కూడ పూజింపవలెను.

మూలవిద్య అంటే మంత్రాధిష్ఠాన దేవత. మూలమంత్రం ద్వావింశత్యక్షరీ విద్యారాజ్ఞీ మంత్రం. అంగన్యాసాదులు ముందు వివరించబడినవే. ఆవాహన, ఆసన, పాద్య, అర్ఘ్య, ఆచమనీయ, అభిషేక, వస్త్ర, యజ్ఞోపవీత, గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్య, తాంబూల, ప్రదక్షిణ, నమస్కారాలు షోడశోపచారాలు. యంత్రం మధ్యలోని త్రికోణం చుట్టూ ఉన్నవి ఆవరణం.



**శ్లో॥ అన్తరాత్మావశేషాత్తు నతో బ్రహ్మాదికాం జపేత్ ।**
**కాలీం కపాలినీం కుల్లాం కురుకుల్లాం విరోధినీమ్ ॥ 46**

**శ్లో॥ విప్రచిత్తాం చ సంపూజ్య షట్కోణేషు బహిస్తతః ।**
**ఉగ్రాముగ్రప్రభాం దీప్తాం తథా త్రికోణకే యజేత్ ॥ 47**

**శ్లో॥ నీలాం ఘనాం బలాకాం చ తథా త్రికోణకే యజేత్ ।**
**మాత్రాం ముద్రాం మితాం చైవ తథా బాహ్యత్రికోణకే ॥ 48**

**శ్లో॥ సర్వశ్యామామసికరాం ముణ్డమాలోపశోభితామ్ ।**
**తర్జన్యా వామహస్తేన ధారయేత్ తాం శుచిస్మితాః ॥ 49**

**ప్రతిపదార్థం :** నతః = వినయముగలవాడై, బ్రహ్మ+ఆదికామ్ = బ్రహ్మ మొదలగు వారిని, ఓంకారము మొదలగువానిని, అన్తరాత్మ+అవశేషాత్+తు = అంతరాత్మ యందే ) చెదరని మనస్సును నిల్పి, జపేత్ = జపించవలెను. కాలీమ్ = కాళిని, కపాలినీమ్ = కపాలినిని, కుల్లామ్ = కుల్లను, కురుకుల్లామ్ = కురుకుల్లను, విరోధినీమ్ = విరోధినిని, విప్రచిత్తామ్ = విప్రచిత్తను, చ = కూడ, సంపూజ్య = పూజించి, తతః = ఆపై, బహిః = వెలుపల, షట్ + కోణేషు = ఆరు కోణమునందు, ఉగ్రామ్ = ఉగ్రను, ఉగ్రప్రభామ్ = ఉగ్రప్రభను, దీప్తామ్ = దీప్తను, తథా = అట్లే, త్రికోణకే = త్రికోణములందు, యజేత్ = సేవించవలెను, నీలామ్ = నీలను, ఘనామ్ = ఘనను, బలాకామ్ = బలాకను, చ = కూడ, తథా = అట్లే, త్రికోణకే = త్రికోణము నందు, యజేత్ = పూజింపవలెను, మాత్రామ్ = మాత్రను, ముద్రామ్ = ముద్రను, మితామ్ = మితను, చ ఏవ = కూడ, బాహ్యత్రికోణకే = వెలుపలి త్రికోణములందు, తథా = అట్లే, యజేత్; వామహస్తేన తర్జన్యా = ఎడమచేతి చూపుడు వ్రేలితో, తామ్ = ఆ, సర్వశ్యామాం = నల్లని రూపములు గలవారిని, అసికరాం = చేత కత్తులు గలవారిని, ముణ్డమాలా+ఉపశోభితాం = పుఱ్ఱెలమాలతో శోభించు దానిని, శుచిస్మితాః = తెల్లని నవ్వుగలవారిని, ధారయేత్ = ధరింపవలెను.

**తాత్పర్యం :** చెదరని శ్రద్ధతో వినయంగా అంతరాత్మయందు ప్రణవబ్రహ్మాదులను నిల్పి, జపించి, ఆ యంత్రమున గల అయిదు త్రికోణములకు సంబంధించిన దేవతలను పూజించవలెను. ఈ పూజాక్రమము ఎడమవైపు నుండి కాలిని, కపాలినిని, కుల్లను, కురుకుల్లను, విరోధినిని, విప్రచిత్తను, ఉగ్రను, ఉగ్రప్రభను, దీప్తను, నీలను, ఘనను, బలాకను, మాత్రను, ముద్రను, మితను – ఈ పదునేనుగురు దేవతలను పూజింపవలెను. ఈ దేవతలందఱు నల్లనివారు. కుడిచేత ఖడ్గమును ధరించి, ఎడమ భుజముపై శిక్షించు దండముతో నుందురు. వీరి కంఠములలోను తల పుఱ్ఱెలమాల యుండగా ముఖమున నవ్వు విరాజిల్లుచుండును.



**శ్లో॥ తతో వై మాతరః పూజ్యాః బ్రహ్మీ నారాయణీ పురా ।**
**మాహేశ్వరీ చ చాముణ్డా కౌమారీ చైవ వల్లభా ॥ 50**

**శ్లో॥ వారాహీ చ తథా పూజ్యా నారసింహీ తథైవ చ ।**
**సర్వాసాం దేవతానాం చ బలిపూజా తథైవ చ ॥ 51**

శ్లో॥ శృఙ్గానులేపనం గన్ధపుష్పధూపాదికం తథా ।
త్రిస్త్రిః పూజా ప్రకర్తవ్యా సర్వాసామపి సాధకైః ॥ 52

శ్లో॥ ఏవం పూజాం పురా కృత్వా మూలేనైవ యథావిధిమ్ ।
నైవేద్యం చ తథా శక్త్యా దేవ్యై దద్యాద్యథా పునః ॥ 53

శ్లో॥ తతో వై దశవారం తు దీపం దద్యాత్తు సాధకః ।
పుష్పాదికం పునః దద్యాన్మూలేనైవ యథావిధి ॥ 54

**ప్రతిపదార్థం :** తతః + వై = ఆ తరువాత, పూజ్యాః = పూజింపదగినవారు, మాతరః = మాతృకలైన, పురా = సనాతనులైన, బ్రాహ్మీ = బ్రాహ్మీ, నారాయణీ = నారాయణి, మాహేశ్వరీ = మాహేశ్వరి, చ = మఱియు, చాముణ్డా = చాముండ, కౌమారీ = కౌమారి, వల్లభా చ ఏవ = వల్లభయును, వారాహీ = వారాహీ, తథా పూజ్యా చ = అట్లే పూజింపదగినది, నారసింహీ = నారసింహి, తథైవ చ = అట్లే, సర్వాసాం దేవతానాం చ = దేవతలందఱకును, బలిపూజా = నైవేద్యద్రవ్యముల పూజ, తథైవ చ = అట్లే, శృఙ్గానులేపనమ్ = చందనపు పూతను, గన్ధపుష్పధూపాదికమ్ = గంధము, పూవులు, ధూపము మొదలైన వానిని, తథా = అట్లే, సర్వాసామ్ + అపి = అందఱకును, త్రిస్త్రిః = మూడు మూడు పర్యాయములు, సాధకైః = సాధకులచేత, పూజా = పూజ, ప్రకర్తవ్యా = చేయదగినది, ఏవమ్ = ఈ విధముగా, పురా = ముందుగా, పూజామ్ = పూజను, కృత్వా = చేసి, యథావిధిమ్ = పద్ధతి ననుసరించి, మూలేన + ఏవ = మూలమునందే దేవ్యై = దేవికి, నైవేద్యం చ = నైవేద్యమును గూడ, తథా = అట్లే, యథా శక్త్యా = శక్తినిబట్టి, దద్యాత్ = ఇవ్వదగును, తతఃవై = తరువాత, పునః = మరల, దశవారం తు = పదిసార్లు, సాధకః = సాధకుడు, దీపం దద్యాత్ = దీపదర్శనము చేయింప దగును, పునః = మరల, మూలేన ఏవ = మూలముతోనే, యథావిధిమ్ = విధివిధానము ననుసరించి, పుష్ప + ఆదికమ్ = పుష్పము మొదలైనవి, దద్యాత్ = ఇవ్వదగును.

**తాత్పర్యం :** ఆ తరువాత బ్రాహ్మీ, నారాయణీ, మాహేశ్వరీ, చాముండా, కౌమారీ, వల్లభా (అపరాజితా), వారాహీ, నారసింహీ అనుపేర్లుగల అష్టమాతృకలను పూజింపవలెను. ప్రతిదేవతకు ముమ్మారు చందనలేపన, గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యాలను సమర్పించవలెను. విధివిహితముగ శక్తికొలది పూజింపవలెను. ఆపై మూలదేవతారాధనచేసి, నైవేద్యమిడి, పదిసార్లు దీపదర్శనము చేయించవలెను. మరల మూలమంత్రంతో యథావిధి పుష్పాదులర్పింపవలెను.

సప్తమాతృకలుగా ప్రసిద్ధియున్నను, అష్టమాతృకలుగా పేర్కొనుట కద్దు. పై శ్లోకంలో చెప్పబడినట్లే కాక మతభేదాలూ కన్పిస్తాయి. ఇక్కడ చెప్పబడిన వారిలో అపరాజిత స్థానంలో చండీ, నారాయణీ స్థానంలో వైష్ణవీ, వారాహీ స్థానంలో చర్చికా అనుపేర్లు కొందఋదహరింతురు. సప్తమాతృకలలో మాహేశ్వరీ బదులు యోగేశ్వరీ, నారాయణీ బదులు వైష్ణవీ, చాముండా బదులు చాముండీ, చర్చికా బదులు వారాహీ, చండీ బదులు ఇంద్రాణిని చెప్పి, బ్రాహ్మీ, కౌమారీని చెప్పుదురు. నామరూపభేదాలుగానే భావింపబడువారు. శ్లోకంలో అపరాజితా, చండీయను శక్తిమాతృకకే వల్లభాయని కూడ పేరున్నట్లు కనబడు తూన్నది.

---

శ్లో॥ తతో సావహితో భూత్వా గురూన్నత్వా శిరః స్థితాన్ ।
ఏవం దేవీం తతో ధ్యాత్వా ఇతి మన్త్రేణ మన్త్రవిత్ ॥ 55

శ్లో॥ తతః శిరసి వై పుష్పం దత్వాష్టాఙ్గం ప్రణమ్య చ ।
విసృజ్య పరయా భక్త్యా సంహారేణైవ ముద్రయా ॥ 56

శ్లో॥ దేవీం ధ్యాత్వా తు హృదయే తన్మయో భవతి ధృవమ్ ।
పురశ్చరణ కాలే తు పూజా చైవ ప్రకీర్తితా ॥ 57

**ప్రతిపదార్థం :** తతః = తరువాత, సావహితో భూత్వా = అవధానముగలవాడై, గురూన్ = గురువులను, నత్వా = నమస్కరించి, శిరః స్థితాన్ = శిరస్సున దాల్చిన గురువులను, ఏవమ్ = ఇట్లే, దేవీమ్ = దేవినీ, ధ్యాత్వా = ధ్యానించి, మన్త్రవిత్ = మంత్రమునెఱిగినవాడు, మన్త్రేణ = మంత్రముతో, ఇతి = ఇట్లు, తతః = ఆపై, పుష్పమ్ వై = పుష్పమును, శిరసి దత్వా = శిరసున ఉంచి, చ = మఱియు, అష్టాంగమ్ ప్రణమ్య = అష్టాంగనమస్కారము చేసి, పరయా భక్త్యా = పరమభక్తితో, సంహారేణ ముద్రయా ఏవ = సంహారముద్రతోనే, విసృజ్య = విసర్జించి, హృదయే = హృదయమున, దేవీమ్ = దేవిని, ధ్యాత్వా తు = ధ్యానించి, ధృవమ్ = నిశ్చయముగా, తన్మయః = దేవీమయుడు, భవతి = అగుచున్నాడు, పురశ్చరణ కాలే తు = పురశ్చరణ చేయు సమయమున గూడ, పూజా = పూజ, ప్రకీర్తితా చ ఏవ = కీర్తింపబడినదే.

**తాత్పర్యం :** అంతట మంత్రసాధకుడు మనస్సును లగ్నము చేసి గురువులను నమస్కరించి, దేవిని ధ్యానించి మంత్రమును జపిస్తూ, పుష్పమును శిరస్సుపై ధరించి, అష్టాంగప్రణామం చేసి, పరమభక్తితో చేతులు జోడించి, హృదయంలో దేవిని ధ్యానించి, దేవీమయుడగును. పురశ్చరణకాలంలో కూడా పై జెప్పబడిన పూజావిధానమునే అనుసరించుట సంప్రదాయము.

సంప్రదాయానుసారం, మూలమంత్రజపం 1008 సార్లు చేసి, చివరలో దేవికే ఆ జపఫలాన్ని సమర్పిస్తూ,

**శ్లో॥ గుహ్యాతి గుహ్యగోప్త్రీ త్వం గృహాణాస్మత్కృతం జపమ్ ।**
**సిద్ధిర్భవతు మే దేవి! త్వత్ప్రసాదాన్మహేశ్వరి ॥ 58**

అను ఈ నివేదన శ్లోకాన్ని పఠించి, అప్పుడు దేవీ ప్రసాదంగా పుష్పాన్ని తన తలపై ఉంచి, దేవిని హృదయంలో నింపి, సాధకుడు, దేవీమయుడవుతాడు. ఇది సత్యం.



